గ్రంథపరిశోధనంబు గావించి మిగుల విరివిగ బ్రయోగ సహితంబుగ అకారాది తెనుఁగునిఘంటు వొకటి వ్రాయ ప్రారంభించి నడపుచుండిరి. ఆమహా ప్రారంభము చూచి యది పరిపూర్తియగుటకు బహుకాలము చెల్లు ననియుఁ బరిపూర్తి యైనను నందు తెనుఁగుపదములుమాత్రమే చేర్పఁబడి యుండుటంజేసి యది విద్యార్థుల కంతగా ప్రయోజనకారి కాఁజాల దనియు, నిదిగాక బడులయందుఁ జదివెడు విద్యార్థు లంత పెద్దపుస్తకము కొని యుంచుకొనుట కష్టముగా నుండు ననియు నూహించి ..................అకారాదినిఘంటు వొకటి వ్రాసి శీఘ్రకాలముననే పూర్తిచేసెదఁగాక యని మిక్కిలి పూనికతో దీని వ్రాయ నుద్యమించితిని."

పై నుదహరించిన యంశమునుబట్టి చిన్నయసూరికి ముందునిఘంటువులయందు కొన్నిలోపము లున్నవనియు నాలోపనివారణార్థము చిన్నయసూరి ఈనిఘంటురచనమును ప్రారంభించె నని స్పష్టమగుచున్నది. పూర్వనిఘంటువుల స్వరూప మెట్టిదో వాని గుణావగుణము లెట్టివో మనము తెలిసికొనినఁ గాని చిన్నయసూరి రచనము నందలి విశిష్టతను మనము గ్రహింపఁజాలము. సంస్కృతమునకు బహుప్రాచీన కాలము నుండియు నిఘంటువు లున్నను తెనుఁగుభాషలో క్రీ. శ. 17-వ శతాబ్దినుండి బయలుదేరినవి. తత్సమపదములను విడిచి యచ్చ తెనుఁగుభాషలో కావ్యములు వెలయుటయే యీనిఘంటు రచనమునకు దారితీసినది. ఈ తెనుఁగునిఘంటువులన్ని యును పదాత్మకములు; పర్యాయపదములుమాత్రమే తెలుపును.

వీనిలో మొదటిది పైడిపాటి లక్ష్మణకృతమగు ఆంధ్ర నామసంగ్రహము. దానికి శేషగ్రంథముగా రచితమైనది ఆంధ్ర నామశేషము. ఇది అడిదము సూరకవి ప్రణీతము. వీనితో సమకాలికముగా మఱి రెండునిఘంటువులు పుట్టినవి. వానిలో తొలిది హాస్యకవి యని ప్రసిద్ధినొందిన కవిచౌడప్ప నిఘంటువు. ఇది సీసపద్యములలో నున్నది. కావుననే వీనికి చౌడప్పసీసములని పేరు. ఇఁక రెండవది మహాప్రసిద్ధుఁడగు గణపవరపు వెంకటకవి ప్రణీతము. ఇది శ్రీ వెంకటేశ్వరస్వామికృతి యగుటచే దీనికి వెంకటేశాంధ్ర మని పేరు. వీనివెనుక కస్తూరి రంగకవి యనునాతఁడు సాంబనిఘంటు వను నిఘంటువును రచించెను. ఈతఁడు డూప్లేవద్ద దుభాషియగు ఆనందరంగపిళ్లె యాస్థానకవి. వీనియన్నింటికంటె మిన్నయగునది సుదురుపాటి వెంకనార్యరచనమగు ఆంధ్రభాషార్ణవ మను ప్రశస్తనిఘంటువు. ఆంధ్రామర మని దీనికి నామాంతరము. అమరమునుబోలె నిందు మూఁడుకాండలు కలవు. అందువలెనే వ్యోమదిగ్వర్గములుగా విభాగ మిందుఁ గలదు. సంస్కృతపదము లన్నిటికి తెనుఁగుపర్యాయపదము లిందుఁ గలవు. ఇది పుదుకోటను పరిపాలించు కోటిరఘునాథనాయకుని కంకితముగా రచితమైనది. దీనివెనుక విశేషాంధ్రము, సర్వాంధ్రసారసంగ్రహము, దేశ్యనామాంతకోశము, ఆంధ్రపదాకరము మున్నగు తెనుఁగు నిఘంటువులు బయలువెడలినవి. కాని వీనియందు నేవిధమైన ప్రత్యేకతయు లేదు. ఇవియన్నియు పద్యమయములే. కావున నవీనులకు సుగ్రాహ్యములై యుపయోగకరములు కావు ఇంతేకాక యివి కావ్యములలోని ప్రయుక్తములైన పద

ములనుమాత్రమే విపులముగా నర్థీకరించునుగాని యెక్కుడు పదజాలము ప్రదర్శింపఁజాలవు. పరిస్థితు లిట్లుండఁగా నవీన యుగము ప్రారంభమైనది. ప్రాచీననిఘంటువులు నవీనవిద్యా ప్రణాళికకు సరిపోలేదు. అందుచే నూతనరీతిని నిఘంటువు లేర్పడవలసిన యావశ్యకత కలిగినది. పద్యరూపమున కాక వచనరూపమున నిఘంటువులు రచితములు కావలసివచ్చెను. అం దకారాదిగా పదములు సరికూర్చి యర్థము నెదురుగ వ్రాసినఁగాని జనబాహుళ్యమునకు విద్యార్థిలోకమున కుప యుక్తములు కావు. అట్టివానిలో మొట్టమొదట వెలువడినది మామిడి వెంకయ్య యను ప్రసిద్ధ వైశ్యపండితుఁడు రచించిన 'ఆంధ్రదీపిక' యనునది. ఇది క్రీ. శ. 1816-లో రచితమై 1849-లో ముద్రితమైనది. ఈకాలముననే ఆంగ్లేయులుకూడ తెనుఁగు నభ్యసించి, తెనుఁగునకు నింగ్లీషుభాషలో నిఘంటు రచనమును వ్రాయుట ప్రారంభించిరి. అట్టివారిలో కాం బెల్ అనునాతఁడు ముఖ్యుఁడు. ఈతఁడు 1821-లో కాంబెల్ నిఘంటువనుపేర తన గ్రంథమును ప్రకటించెను. దీనివెనుక ఆంధ్ర భాషోద్ధారకుఁడై మహాప్రసిద్ధిచెందిన బ్రౌనుమహాశయుఁ డొక పెద్దనిఘంటువు నిర్మించెను. ఇదియే బ్రౌనునిఘంటు వనుపేరఁ బరఁగుచున్నది. ఇది 1852-వ సంవత్సరమున నచ్చొత్తింపఁబడి నది. అంతకుముందు నిఘంటువులకన్న నీనిఘంటువునందు రెండు మూఁడు విశేషములు కలవు.

౧. తెనుఁగుపదములకు తెనుఁగర్థములే కాక ఇంగ్లీషు భాషలో నర్థము లియ్యఁబడినవి.

౨. పదములకు ఆయా గ్రంథములనుండి ప్రయోగములు సేకరింపఁబడి యుదాహృతములైనవి.

3. ఆశ్వాససంఖ్యయు పద్యసంఖ్యయుకూడ నీయఁబడియున్నవి.

౪. ఈనిఘంటువుతోకూడ అన్యభాషాపదము లగు హిందుస్థానీ ఫారసీ యింగ్లీషు తమిళము మహారాష్ట్రమునకు సంబంధించినపదములుకూడ "మిశ్రనిఘంటువు" అనుపేర రచితమైనది.

౫. ఈగ్రంథమున శ్లోకయమూల్యమగు పీఠికకూడ చేర్పఁబడియున్నది. అందు కొంతమంది కవులనుగూర్చి కావ్యములనుగూర్చి విశేషములు తెలుపఁబడినవి. ఇట్లున్నను ఈ నిఘంటువునందు గ్రాంథికపద్ధతికి ననుకూలమగురచన లేదు. ఇందు శకటరేఫములుగాని అర్ధానుస్వారములుగాని పాటింపఁబడలేదు. దంత్యతాలవ్యములు అనఁగా "చ చే", "జ జే" లు వేఱువేఱుగా చూపఁబడక ఆయావర్గములయందే చూపఁబడినవి. దీనివలన ప్రాచీనకావ్యసంస్కరణమునకు వలయు పదములయొక్క సరియగురూపములను తెలిసికొనుటకు పాఠభేదములు గ్రహించుటకుమాత్రమే వీలగుచున్నది కాని వ్యాకరణసంప్రదాయములను ప్రయోగవిశిష్టతను గ్రహించుటకుపయుక్తమగుటలేదు. కాఁబట్టి యీనిఘంటు వున్నతసాహిత్యవిద్యాప్రణాళికకు తోడ్పడలేదు.

పై నిఘంటువులలోని లోపములన్నియు గమనించి ఆంధ్రవ్యాకరణలక్షణమునకు లక్ష్యముగ నుండునట్లుగను రూపనిష్పత్తులనుగూర్చి స్పష్టమైనపరిజ్ఞానము కలుగుటకును ఒకేపదము

నకు సందర్భము ననుసరించి యేర్పడుచుండు నర్థచ్ఛాయలు విదిత మగునట్లుగను నొకనిఘంటువును చిన్నయసూరి వ్రాయ నుద్యమించెను. దానికొఱ కాతఁడు వాఙ్మయమున ప్రామాణికులగు మహాకవుల కావ్యములను పఠించి తానే స్వయముగా నందలి పదములను తీసి వ్రాసుకొనెడివాఁడు. ఆకాలమునం దిప్పటి వలె నచ్చుపుస్తకములు విశేషముగ లేవు. కేవలము తాళపత్ర ప్రతులను పరిశీలించి చిన్నయసూరి పరిశ్రమచేయవలసివచ్చెను. ఈసందర్భమున నాతఁడు చేసిన పరిశ్రమ యనితరదుర్గ్రాహ్య మని చెప్పనొప్పును. తాను చూచిన ప్రతిపదమును బాగుగా విమర్శించి చూచుకొనుబాధ్యత చిన్నయసూరియం దుండుటచే నాతనినిఘంటువు కొంతవరకు సాగినను అతని జీవితకాలములో సంపూర్తికాలేక నిల్చినది. పైని వివరించినట్లుగా నిందు తెనుఁగు పదములకే ప్రాధాన్య మియ్యఁబడియున్నది. కొలఁదిగా సంస్కృతపదములుకూడ కలవు. ఈనిఘంటువు నేడుసంపుటములలో సూరి స్వయముగా వ్రాసియున్నాఁడు. ఇది చిత్తుప్రతి యని చెప్పనొప్పును. పేరునకు "చిత్తుప్రతియేగాని సూరి ఎక్కడను నొక్కతుడుపైనను లేకుండ వ్రాసియున్నాఁడు. కాని వ్రాయవలసినవిషయములు వ్యత్యస్తముగా నుండుటచే క్రొత్త వానిని చేర్చి తిరిగి దానిని సాఫీగా వ్రాయవలసివచ్చినది. మరల నట్టినిఘంటువు ప్రథమసంపుటము సూరియే స్వయముగా వ్రాసియున్నాఁడు. ఇవి నేఁటివఱకును శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు కార్యస్థానమునఁ గలవు. ఇందులోనిపదములను సూర్యరాయాంధ్రనిఘంటువున తీసికొనఁబడినవి. ఈనిఘంటువులేకాక

ఆతఁ డేయేగ్రంథములనుండి పదములను తీసెనో యవికూడ భద్రపఱుపఁబడినవి. వానిలో నీక్రింది గ్రంథములు కలవు.

1. కవిత్రయరచితమహాభారతము.
2. మహాభాగవతము.
3. భాస్కరరామాయణము.
4. నిర్వచనోత్తరరామాయణము.
5. పద్మపురాణము.
6. శృంగారనైషధము.
7. కాశీఖండము.
8. భీమఖండము.
9. హరవిలాసము.
10. సింహాసనద్వాత్రింశిక.
11. చంద్రాంగదచరిత్రము.
12. దాశరథీశతకము.
13. లావణ్యశతకము.
14. హరభక్తవిలాసము.
15. ఆంధ్రభాషార్ణవము మున్నగునవి.

పై చిన్నయసూరిరచితనిఘంటువునే చిన్నయసూరి శిష్యులగు సీతారామాచార్యులవారు సంగ్రహించి దానిని పెంపుచేసి రని కింవదంతి గలదు. ఇది ముద్రితమైనచో నెన్నినిఘంటువులు వెలసినను దీనిప్రాముఖ్యము తగ్గదు.

## పదియవ ప్రకరణము

### ఆంధ్ర ధాతుమాల

చిన్నయసూరి యాంధ్రభాషకు ధాతువులనుగూర్చి ఆంధ్రధాతుమాల యనుపేర నొకగ్రంథమును రచించె నని యాంధ్రసాహిత్యపరిషత్తువారు క్రీ. శ. 1930-లో ముద్రించి ప్రకటించిరి. ఇది చిన్నయసూరి గ్రంథములయందు వ్రాఁతలో నాతని స్వంతయక్షరములతో లిఖింపఁబడియుండుట చూచి పరిషత్తువారు దానిని చిన్నయసూరికృతముగా ప్రకటించి యున్నారు. కాని గ్రంథమునందలి కొన్ని రూపములు పరిశీలించిన అది యాతనిరచన గాదని తెలియుచున్నది. ఈధాతుమాలకు పీఠికను వ్రాసిన విద్వాంసులుకూడ ఈకర్తృత్వవిషయమున కొంతసందేహమును చూపియుండిరి. ఆసందేహము నిశ్చయమైనది. ఏలనఁగా దీనిని వాస్తవముగా రచించినవారు వేదం పట్టాభిరామశాస్త్రులవారు. వీరు క్రీ. శ. 1820 నాఁటికే పరమపదించుటవలన ఈధాతుమాల చిన్నయసూరి పదునాలుగేండ్ల వయసునాఁటికే యున్నదని మనము గ్రహింపవచ్చును. ఈధాతుమాల రచనావృత్తాంత మిది.

సంస్కృతభాషలో ధాతుపాఠమువలె తెలుగున ధాతుపాఠమును రచించినవారిలో తొలివారు పట్టాభిరామశాస్త్రిగారే యని చెప్పనొప్పును. ఆకాలమున ఫోర్టుసెంటుజార్జికళాశాలకు అధ్యక్షులైన ఇల్లిసు (Mr F. W. Ellis) దొర భాషాతత్త్వశాస్త్రమును నవీనరీతిని రచించుటకు మార్గదర్శకులైనవారు. వారికొఱకీగ్రంథమును శాస్త్రిగారు రచించిరి.

ఇల్లిసుదొర 1816-లో ప్రకటించిన "A Dissertation on the Telugu language" అను చిన్నగ్రంథమున నీధాతుమాలను గూర్చి వ్రాసియున్నారు. ఇది ఆసంవత్సరముననే ప్రకటితమైన క్యాంబెలుగారి వ్యాకరణములలో పీఠికకు ననుబంధముగా చేర్పఁబడియున్నది. ఇల్లిసుదొరగ్రంథము హిందూదేశములో భాషాతత్త్వశాస్త్రగ్రంథములలో మొదటిది కాఁబట్టి పునర్ముద్రణము గావింపఁదగినది.

ఈధాతుమాలస్వరూపమును దెలుపుట కీ క్రింది వివరణాంశములు తోడ్పడఁగలవు.

ఈధాతుమాలకు పట్టాభిరామశాస్త్రి స్వహస్తలిఖిత గ్రంథమునుండి ఒకకాగితపుప్రతి తయారుచేయఁబడినది. దానిని గూర్చి బ్రౌనుదొర యిట్లు వ్రాసియున్నారు:

"The original of this very valuable work is in the College and I am informed that no copy except the present was ever taken.

[మిక్కిలి విలువగల ఈగ్రంథము మూలప్రతి కాలేజిలో (ఫోర్టుసెంటుజార్జికోటలో) తప్ప వేఱే లేదు. దానికీ యొక్క ప్రతిమాత్రమే గలదు.] నేఁడు పట్టాభిరామశాస్త్రి వ్రాఁతప్రతి కనిపించుటలేదు. ఈప్రతి క్రీ. శ. 1826-లో వ్రాయఁబడినది. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున దీనిసంఖ్య 1227.

ఇందులో దేశ్యధాతువులేకాక "అటా_యించు" మున్నగు హిందుస్థానీధాతువులును గలవు.

మొదట: క్రియాలక్షణంబు వర్తనార్థకంబునందు ధాతువునకు పరముగా చువర్ణకంబు చువర్ణకంబునకు పరంబుగాఁన్' _

అని యనుబంధకంబు దానిమీఁద వన్నెను, వన్నెలు, ఆను, ఆవు, ఆడు, ఆము, ఆరు, అరు.

అడి—స్త్రీ

అది, అవి.........జడపశ్వాదుల

ప్రక్రియ—పాడు అనునది ధాతువు. దానిమీఁద చువర్ణకంబు వచ్చితే పాడుచు, దానిమీఁద చున్. అని అను బంధకము వచ్చితే పాడుచున్, దానిమీఁద ఆనువన్నె వచ్చితే పాడుచున్నాను. ప్రతితెనుఁగుధాతువునకు సంస్కృతార్థ మీయఁబడి వివరింపఁబడినది.

| ధాతువు. | సంస్కృతార్థము. |
|---|---|
| సోలు | పిత్తాది వైవశ్యేపరాజయే చ |
| హత్తు | అవలంబనే సన్నిధానేచ |
| హెచ్చ్ | విజృంభణే; అతిశాయనేచ |

| కర్మకము. | క్రియ. | తెలుఁగుఅర్థము. |
|---|---|---|
| అ | సోలడము | పిత్తాదులచేత వివశుఁడయ్యె చెడె |
| స | హత్తడము | అవలంబించె, దాపునంజేరె |
| అ | హెచ్చడము | విజృంభించె, అతిశయించె |

| వర్తమాన - | భూత - | భవిష్యత్ - | తద్ధర్మములు. |
|---|---|---|---|
| చు | ఇత్ | ఇస్ | ఎద్, ద్ |
| చు | ఇత్ | ఇన్ | ఎద్, ద్ |
| చు | చు | చిత్ | చిన్ చెద్ |

ఇట్లు సామాన్యముగా ప్రథమమధ్యమోత్తమపురుష ములలో భూతభవిష్యద్వర్తమానతద్ధర్మార్థములలోఁ గలుగు

తెలుఁగు క్రియారూపములకు ప్రక్రియానిష్పత్తులను తరువాత నకారాదిక్రమమున నెల్ల తెలుఁగుధాతువుల పాఠమున సంస్కృతాంధ్రములయందు వానియర్థవివరణమును ప్రత్యయాదులును వాడుకభాషలో లక్షణములును వివరింపఁబడినవి. పైయంశము లనుబట్టి వ్యాకరణము చేయువారికి ఈగ్రంథ మెంత యుపయోగమో మన మూహింపవచ్చును.

బాలవ్యాకరణమును రచించుటకు తనకుముందున్న గ్రంథములను పరిశీలించియే వ్రాసియున్నాఁడు. అందులో ధాతుమాల యొకటి. ఆకాలమున అచ్చు విశేషముగా లేనందున తానే స్వయముగ వ్రాసుకొన్నప్పుడు తనమతమునకు విరుద్ధమగుచోట్ల మూలమున సంస్కరించినాఁడు. ఈధాతుమాల కూడనట్టిదే. "సోలడము, హత్తడము" మొదలగునవి సూరిగారికి సమ్మతములు కావుకదా! కాని ఒక్కవిషయ మిచట చెప్పఁదగినది. ఈగ్రంథముయొక్క విలువను ఉపయోగమును కనిపెట్టినకీర్తి చిన్నయసూరిగారిది. నేఁటికిని మన వ్యాకరణపండితులకుఁగాని భాషాతత్త్వశాస్త్రజ్ఞులకుఁగాని దీని విశేషవిశిష్టతలు తెలియవు. చిన్నయసూరి యాకాలముననే దీనిని గుర్తించుట యాతని పరిశోధనాశక్తికి సాక్షీభూత మని చెప్ప నొప్పును. తెనుఁగుభాషాచరిత్రను శాస్త్రీయపద్ధతితో సమన్వయించు నీదినములలో ఈగ్రంథము తప్పక ముద్రింపఁదగినది. 1840-లో బ్రౌనుదొరవారు వ్రాసిన తెలుఁగుభాషావాఙ్మయవిషయకోపన్యాసములో "Essay on Telugu language and literature" అను వ్యాసమున నీగ్రంథప్రశంస గావించియున్నారు.

పైని వివరించిన యుపపత్తులను పరిశీలించిన ఈగ్రంథము చిన్నయసూరికృత మెంతమాత్రమును గాదని మనము గ్రహింపవచ్చును. ఇం దింకొకవిశేషముగూడఁ గలదు. వ్రాఁతప్రతియందు ధాతువు సంస్కృతార్థము ఆంధ్రార్థము వర్తమాన భూతభావి కాలికప్రత్యయములు విశేషములోని యేడువిభాగములుగా ప్రదర్శింపఁబడినను ముద్రణమున ధాతు ధాత్వర్థమును మాత్రమే ప్రకటింపఁబడినవి. అన్నిధాతువులకు వర్తమానమున చువర్ణకమును భూతమున ఇత్ ఇన్ వర్ణకములును భావిని "యెద్, ద్" వర్ణకములును తెలుపఁబడినవి. విశేషములందు సమాసధాతువులు శాస్త్రీయములు అస్వతంత్రములు మొదలగువిషయములు వేరొకానఁబడినవి. అన్నిటికి చివర "డము" ప్రత్యయముతో నర్థము నిరూపింపఁబడినవి. పైయంశ మొక్కటియే నిర్వివాదముగా నిది చిన్నయసూరికృతము కాదని యుద్ఘోషించుచున్నది.



## పదునొకండవ ప్రకరణము

### సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణము

ప్రాచీనకాలమున నన్నయాథర్వణులవలె నవీనకాలమున చిన్నయ సంస్కృతభాషలోనే సూత్రరీతిని నొకవ్యాకరణమును రచించెను. దానికే సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణ మని పేరు. ఇది ౧. సంజ్ఞా, ౨. సంధి, ౩. అజంత, ౪. ఆచ్ఛిక, ౫. సర్వనామాని, ౬. కారక, ౭. సమాస, ౮. తద్ధితపరిచ్ఛేదములు గలది. ఈవిభాగమునుబట్టి యిది పాణినీఅష్టాధ్యాయి ననుసరించి

వ్రాయఁబడినవి. గ్రంథప్రారంభమున ముం దీక్రిందిశ్లోకము చెప్పఁబడినది.

"అస్తి కల్పద్రుమః కో౽పి జాతరూపలతావృతః,
వేంకటాద్రిశిఖారూఢః స్మరతాం పరమార్థదః.

గ్రంథాంతమున సర్వం లక్షణం చిన్నయసూరీయాణి సూత్రాణి సీథాదృష్టమ్ అని కలదు. ఇదియును బాలవ్యాకరణమునకు పూర్వము రచింపఁబడినదే యగును. ఏలయనఁగా నిందలి సంస్కృతసూత్రములకు తెనుఁగుభాషాపదము లనుసంధింపఁబడినవి. అయినను వ్యాకరణశాస్త్రము శబ్దబ్రహ్మము ప్రతిపాదించుటచేత నీతఁడు మొదటిసూత్రములనే 'ఆంధ్రభాషాసంబంధినీ సిద్ధిర్లోకస్య వ్యవహారాదవగంతవ్యా, తద్ధి శాసనమిదంమనారంబనేయమిత్యాశంక్యాశాసనమితి' అని వ్యాకరణశాస్త్రమర్యాద లేని తెనుఁగుభాషకు సంస్కృతవ్యాకరణముతో సమానమగు ప్రతిపత్తిని గడించినాఁడు. దీనినే తిరిగి సూత్రములుగాకూడ తెనుఁగున శబ్దలక్షణసంగ్రహమున ననువదించియున్నాఁడు. సంస్కృత పదములును తెనుఁగుపదములను ఎట్లు సమ్మేళనము చేసియున్నాఁడో ఈక్రిందియుదాహరణమునుబట్టి గుర్తింపవచ్చును.

"కచటతపాః పరుషాః
గజడదబా స్సరళాః
ఉభయే కంపాః
హలః పరేస్థిరాః
చుస్తాలవ్యే తాలవ్యాః
అన్యత్ర దన్త్యాః

అక్కజాదిషు (కంచంత - కాచాకు - పచ్చాకిత్యాదీనా మక్కజాది త్వాత్సాధుత్వమవగన్తవ్యమ్)

దీనినిబట్టి చూచినచో తెనుఁగుభాషకు సంస్కృత వ్యాకరణపరిపాటి నలవఱచుటయే కాక తెనుఁగు తెలియని సంస్కృతపండితులకు తెనుఁగుభాషాసంప్రదాయము లను తెనుఁగువ్యాకరణపరిపాటిని తెలియఁజేయుటకు సూరి దీనిని రచించియున్నాఁడు. కాని తనవ్యాకరణపాండిత్యప్రకర్ష ప్రదర్శించుటకుఁ గా దని విశదముగా తెలియుచున్నది కదా!

## విశ్వనిఘంటువు టీక

సూరిగారు విశ్వనిఘంటువునకు తెనుఁగుటీక వ్రాసి నట్లుగా "సుజనరంజని" యను తెలుఁగుపత్రికయందు నీక్రింది విధముగా వ్రాయఁబడియున్నది. క్రీ. శ. ౧౮౬౫-వ సంవత్సరము డిసెంబరునెల పత్రికలో బహుజనపల్లి సీతారామాచార్యులవారు, కారుమంచి సుబ్బరాయలునాయునివారు, వింజమూరి కృష్ణమాచార్యులవారు వ్రాసిన యంశములు. ఇది సూరిగారు పరమపదించిన వెనుక మూఁడేండ్లలో ప్రకటితమైనవి. దీనివలన సూరిగారిగ్రంథములకే గాక వారిపాండిత్యమందును ప్రజలకు నెట్టియభిప్రాయములు గలిగియుండెడివో తెలియ వచ్చును.

"ఈవచనకావ్యము "నీతిచంద్రిక" మిక్కిలి ప్రౌఢము గాను లక్షణములకు ముఖ్యలక్ష్యములుగాను జక్కనిప్రయోగములు గలదిగాను గానఁబడుటచేత లోకమునం దిది విశేష వ్యాప్తి గలిగియుండఁదగినది. దీనిని రచించిన పరవస్తు చిన్నయసూరిగారి కాంధ్రమునందును తదుపయుక్తసంస్కృతప్రాకృత

ములయందు దలస్పర్శియగుపరిజ్ఞానము గల ‍‍దని వారు చేసిన లక్ష్యలక్షణగ్రంథములే నిరూపించుచున్నవి. మేము వారితోడ చిరకాలము సావాసముచేసి యాంధ్రముసందలి యనేకవిషయం బుల నెఱింగినవారము గనుక వారిపాండిత్యము మా కనుభవ సిద్ధము. వారు రచించిన గ్రంథములలో ముఖ్యములు:— శబ్దలక్షణసంగ్రహము, బాలవ్యాకరణము, నీతిచంద్రిక. వీ రారంభించి ముగింపనివి అకారాదినిఘంటు వొకటి, సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణ మొక్కటి, విశ్వనిఘంటువునకు టీక యొకటి. ఈమూఁడును ముగిసియుండెనేని యాంధ్రభాషకు మరి యపేక్షణీయ మేమియు నుండ నేరదు. ఆంధ్రభాషయొక్క అభాగ్యమే వారిని కీర్తిశేషులను గావించెను. ఈగ్రంథము లను సమగ్రములనుగాఁ జేయింపవలె నని Honourable గాజుల లక్ష్మీనరసింహులుసెట్టిగారు, C. S. I. బహుప్రయత్న ములు చేయుచున్నారు. వారియత్నము సఫలము కావలయు నని మేము సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాము." అని.

ఇందు పేర్కొన్న విశ్వనిఘంటువుటీక నేఁటివరకు లభ్యము కాలేదు.

## నీతిసంగ్రహము

నీతిసంగ్రహ మను నీగ్రంథము చిన్నయసూరిచే ప్రాచీన కవులనుండి ఏర్చికూర్పఁబడినది. ఇందు ముఖ్యముగా భారతము నుండి ఆయాసందర్భములనుండి గ్రహింపఁబడినవి. చిన్నయసూరి అచ్చటచ్చట తనస్వంతముగా రచించిన పద్యములనుకూడ చేర్చి యున్నాఁడు. ఇందు నూఱుపద్యములు గలవు. ఇవన్నియు నీతి బోధకములే. దీని కొక్కటిప్పణిగూడ నుండుటచే నాలుగైదు

తరగతుల బాలబాలికలకు అవశ్యపఠనీయముగా నుండెడిది. ఇది 1855-వ సంవత్సరములో ముద్రితమైనది.

## అక్షరగుచ్ఛము

ఇది బాలురు బాలికలు ప్రథమమున భాష నేర్చుకొనునపుడు సరియగు వర్ణక్రమమును గుణితమును సక్రమరీతి నభ్యసింపఁజేయుటకై చిన్నయసూరి యకారాదిక్రమమున నీయక్షరగుచ్ఛమును రచించి ప్రకటించెను. ఇదియును చాలకాలమువరకు పాఠశాలలో ప్రాథమికవిద్యాభ్యాసపరుల కుపయుక్తమైయుండెడిది. ఇందు ముందుగా నచ్చులును పిమ్మట హల్లులును ఆవెనుక నచ్చులతోఁ గూడిన హల్లులు గల చిన్నపదములును తెలుపఁబడినవి. సంస్కృతపదముల యుచ్చారణమునుబట్టి చక్కఁగా వ్రాయుటకును తెనుఁగువ్రాఁతయందు తప్పులు లేకుండానుండుటకును నిది మిక్కిలి యుపచరించుచున్నది. గుణింతక్రమమునకు వీరు కొన్ని సూత్రములనుకూడ నచ్చటచ్చట రచించిరి. వ్యాకరణసూత్రములుకూడ కొన్నింటిని నచ్చటచ్చటఁ జేర్చిరి. ఇట్లు పదములు తెలిపినవెనుక క్రియారూపములు చెప్పఁబడినవి. ఇవి రెండువిధములుగా విభజింపఁబడియున్నవి. ౧. తత్సమక్రియలు లేక సంస్కృతసమక్రియలు, ౨. వికృతిక్రియలు లేక దేశ్యక్రియలు. సంస్కృతక్రియలలో ఇతంజంతములు, మతుబంతములు, ఇన్వంతములు, మత్వర్థీయములు, అల్వంతములు, భావప్రత్యయాంతములు, తవ్యాంతములు, అనీయంతములు, తుజంతములు, యుడంతములు మొదలగు వ్యాకరణపారిభాషికము లనేకము లిందు తెలుపఁబడినవి. వికృతిరూపములకు భూత వర్తమాన భవిష్యదర్థకరూపములును

చూపఁబడినవి. కేవలము బాలు రుచ్చరింపలేని కష్టతమమైన యుచ్చారణమును సులభరీతిని గ్రహించుటకు నిందు ప్రయత్నము చేయఁబడియున్నది. ఇది యెంతయు శ్లాఘనీయమై యున్నది. నేఁటి స్వరశాస్త్రపద్ధతుల ననఁగా (phonetic laws) ననుసరించి యిది విరచితమైనది. ఈఅక్షరగుచ్ఛము చదువుటచే సంస్కృతాంధ్రముల రెండిటిని చక్కఁగా నలవఱచుకొనవచ్చును. భాషాభ్యాసకులకు నిది ప్రథమసోపానమువంటిది యని చెప్పనొప్పును.

## విభక్తిబోధిని

భాష నభ్యసించువారు తొలుత యక్షరములను గుణింతములను నేర్చుకొందురు. ఆవెనుక పదములు నేర్చుకొందురు. వీని రెండింటికొఱకు చిన్నయసూరి అక్షరగుచ్ఛమును రచించెను. ఇఁక పదములు నేర్చుకొన్న వెనుక నొకపదమునకు మరియొకపదమునకుఁ గల సంబంధమును తెలిసికొనవలయును. దీని కొఱకు చిన్నయసూరి విభక్తిబోధిని యను గ్రంథమును రచించెను. ఇది సంస్కృతమున శబ్దమంజరి ననుసరించి రచితమైనది. ఇందు తత్సమశబ్దములకు ఆచ్ఛికశబ్దములకు ప్రథమాదిసప్త విభక్తులయందు వచ్చురూపములు చూపఁబడినవి. ఆపైని సర్వనామములకుఁగూడ సప్తవిభక్తిరూపములును కనఁబఱుపఁబడినవి. సంస్కృతభాషాభ్యాసకులకు శబ్దమంజరివలె నాంధ్రమున నిది విద్యార్థుల కత్యంతోపకారియై వెలయుచున్నది. దీనినికూడ పాఠశాలలయందు చాలకాలమువర కుపయోగించెడివారు. ఇది ప్రస్తుతము ప్రచారమున లేకున్నను మరల ప్రచారము

లోనికి తేఁదగినది. ఇది చిన్నయసూరి రెండేండ్లకు పరమపదించు ననఁగా ప్రకటింపఁబడినది.

## ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్య

చిన్నయసూరి తన బాలవ్యాకరణమును నన్నయవిరచిత మగు ఆంధ్రశబ్దచింతామణి ననుసరించి రచించె నని బాలవ్యాకరణవ్యాఖ్యాతలెల్లరును వ్రాసియున్నారు. ఇది యెంతయు సమంజసమే. తెనుఁగునకు సంస్కృతభాషలో రచితమైన వ్యాకరణములలో ఆంధ్రశబ్దచింతామణి, అథర్వణకారికావళి ముఖ్యములు. చిన్నయసూరి అథర్వణవ్యాకరణమునుకూడ నుదహరించెను కాని దాని కంతప్రామాణికత నీయలేదు. ఆంధ్రశబ్దచింతామణికే యత్యంతప్రామాణిక మిచ్చి దాని ననుసరించుటయే కాక దాని కొకవ్యాఖ్యానమునుకూడ రచించియున్నాఁడు. కాని యిప్పు డావ్యాఖ్యానము లభ్యమగుట లేదు. చిన్నయసూరి వ్యాకరణరచనమునకు నెట్టిపరిశ్రమ చేసెనో ఈవ్యాఖ్య లభ్యమైనచో మనకు తెలియఁజేయఁగలదు. ఈరచనము నాఁటికి సంస్కృతమూల మగునాంధ్రశబ్దచింతామణి ముద్రితమై యున్నది. కాని చిన్నయసూరి దాని నుపయోగించెనో లేదో తెలిసికొనుటకు మన కవకాశములు లేవు. పండితలోకములో నిది ప్రచారమున నున్నట్లు లేదు.

## చిన్నయసూరిగారి పద్యరచనలు - ప్రాస్తావికములు

చిన్నయసూరి కేవలము వచనరచనాసంప్రదాయముల నెలకొల్పిన విద్వాంసుఁడేకాక ప్రశస్తమగు పద్యరచనాసంప్రదాయమునుకూడ నిలువఁబెట్టిన విద్వత్కవి. నిఘంటురచనకై

పదములు సేకరించుటకు బహుమహాగ్రంథములను కూలంకషముగ పరిశోధించుటచేత సూరికి సులక్షణమును సరసమును నగు కవితాధోరణి యలవడినది. ఒకమహాకావ్య మేదైన వ్రాయుటకు నాతనికి తగినయవకాశము లభింప లేదు. కాని ప్రాస్తావికముగ నాతని కవితానైపుణ్యమును ప్రదర్శించుటకు తగినసందర్భములు తటస్థింపకపో లేదు. ఆతఁ డేనాఁడు పద్య రచన ప్రారంభించెనో మనకు తెలియ లేదు కాని ప్రభుత్వమునకు సంబంధించిన యుత్సవములయందును పచ్చయప్పవార్షికోత్సవ సందర్భమున నాతఁడు రచించిన పద్యములును నీతని కవితా రచనయొక్క ప్రథమ ద్వితీయదశలను సూచించుచున్న వని చెప్పవచ్చును. మొదలో మొదటిరచన "రాణిగారి మకుటాభిషేక మునకు రచించిన పద్యములు." ఇవి విక్టోరియాచక్రవర్తిని క్రీ. శ. 1837-వ సంవత్సరమున సింహాసన మధిష్ఠించినప్పుడు చిన్నయసూరి రచించిన పద్యములు. ఈపద్యములు మనకు లభింప లేదు. అకాలమునందు నిట్టిపద్యరచనలను ప్రకటించుటకు పత్రికలును లేవు. అప్పటి కింకను కంపెనీవారిపరిపాలనయే వర్తిల్లుచుండుటచేత ప్రభుత్వమువా రాపద్యములను ప్రకటింప లేదు. తర్వాత పద్యరచనలలో పేర్కొనఁదగినవి పచ్చయప్ప మొదలిమీఁద వ్రాసిన పద్యములు.

దక్షిణహిందూ దేశమున దానధర్మములకు ప్రసిద్ధికెక్కిన పచ్చయప్ప మొదలారిగారి వార్షికోత్సవమునుజరుపుచు ప్రతి యేఁడును నాయుత్సవసందర్భమున పండితులను రావించి వారిని సత్కరించుచుండెడివారు. వీరిలో సంస్కృతపండితులును తెలుఁగు పండితులును తమిళపండితులును నుండెడివారు. వీ రప్పుడు రచిం

చిన పద్యములును శ్లోకములును ప్రత్యేకముగా నొకగ్రంథ మున 'పచ్చయప్ప యశోనృపమండన' మనుపేర సంగ్రహింపఁబడి నవి. అందు క్రీ. శ. 1845 నుండి 50 వరకు రచితమైనపద్యములు కలవు చిన్నయసూరి పచ్చయప్పకళాశాలయందు తెనుఁగుపండిత పదవిని నిర్వహించినవాఁడగుటచేత ఆకళాశాలను విడిచిపెట్టి నను తనకృతజ్ఞతను చూపుటకు నీవార్షికోత్సవములయందు పాల్గొనుచుండెడివాఁడు. ఆతనిపద్యములలో కొన్నింటి నీవరకే యాతని శైలిని తెల్పుచు నుదహరించియుంటిని. మిగిలినపద్యము లన్నియు ఆయాసంవత్సరక్రమమున నిం దొకయనుబంధమున పొందుపఱచుచున్నాను.

ఒక తెనుఁగుపద్యములనే కాక యప్పుడప్పుడు సూరి శ్లోకములనుకూడ వ్రాయుచుండెడివాఁడు. అవియును ఇందు చేర్పఁబడినవి. సంస్కృతాంధ్రపండితులు వీని స్వారస్యమును గ్రహింతురుగాక! ఇవియేకాక బాలవ్యాకరణమునకు నీతిచంద్రికకును ముఖబంధముగా కొన్నిపద్యములను తక్కిన వ్యాకరణాదిగ్రంథములకు సంస్కృతశ్లోకములను వ్రాసియున్నాఁడు. ఇవి యాతని సంస్కృతకవితాపటిమను ప్రదర్శించుచున్నవి.

ఇవిగాక చాటుపద్యము లను పేర కొన్నిరచనలఁ గావించి నట్లు ధాతుమాలపీఠికవలన తెలియుచున్నది. కాని యవి లభ్యము కాలేదు.

### చిన్నయసూరి శిష్యులు, సమకాలికులు

చిన్నయసూరి తనకాలమునందే సమకాలికపండితవర్గముచే పండితమండలికెల్ల ప్రధానపండితుఁడుగా, నగ్రేసరునిగా నంగరు

నామోదించిరి. కాలము గడచినకొలఁదిని యీతనికి కొంతశిష్యవర్గముకూడ నేర్పడినది. వారిలో ప్రథములు ప్రఖ్యాతపండితులు బహుజనపల్లి సీతారామాచార్యులవారు. వీరు శబ్దరత్నాకర నిఘంటువునేకాక బాలవ్యాకరణమునకు శేషగ్రంథమగు ప్రౌఢ వ్యాకరణ మను నొకవ్యాకరణమునుకూడ రచించియున్నారు. దీనికే త్రిలింగలక్షణశేష మని నామాంతరము. సీతారామాచార్యులవారి గ్రంథములు రెండును జగద్వ్యాప్తము లైనవి. అయినను వా రెచ్చటను సూరిగారి యమేయపాండిత్యమును ప్రతిభయును ప్రశంసించుచువచ్చిరే కాని వారికి తాము శిష్యుల మని యెచ్చటను చెప్పుకొనియుండలేదు. నిఘంటువునుగురించి వ్రాసినపుడు వా రేమి వ్రాసినదియు నిదివరలో తెలిపియే యున్నాను. ప్రౌఢవ్యాకరణమునఁగూడ పీఠికలో నిది బాలవ్యాకరణమునకు శేషగ్రంథ మని కాని చిన్నయసూరిగారికి తాము శిష్యుల మని కాని చెప్పియుండలేదు. వారు నిఘంటురచన చేయుటచేత దానికొఱ కనేక ప్రాచీనప్రయోగములు సేకరించితి మనియు అవి యొకలక్షణగ్రంథముగా కూర్చితి మనియు నందు వివరించియుండిరి. కాని వీ రిచ్చిన విషయములనుబట్టి చూచిన సూరిగారి సూత్రములకు పరిశిష్టములుగా రచితము లైన వని ప్రాజ్ఞులకు తోఁచకపోదు. ఇది యెట్లున్నను సీతారామాచార్యుల వారు సూరిశిష్యు లనుట నిర్వివాదాంశము.

౨. వైయాకరణము రామానుజాచార్యులు: ఈతఁడు గొప్ప సంస్కృతాంధ్రపండితుఁడు. ప్రథమమున వీ రిరువురకును సమావేశము పచ్చయప్పవార్షికోత్సవసందర్భమున సంఘటించినది. అప్పుడు రచింపఁబడినపద్యములలో సూరిపద్యములకే

ప్రథమసత్కారము కావింపఁబడినది. నాఁటినుండియు నీతఁడు సూరిప్రతిభనుగుర్తించి యాతని గురువుగా నంగీకరించెను. ఈతఁడు పద్యరచన చేయుటయే కాక మహాభారతము ఆది పర్వమునంతటిని వచనముగా రచించెను. అది క్రీ. శ. 1847-వ సంవత్సరమున ముద్రితమైనది. ఒకవైపున నన్నయభట్టారకరచితమైన పద్యభాగమును దాని కెదురుగా వేఱొకపుటయందు ఈవచనమును ముద్రితమైనవి. ఈవచనమును సూరి సంస్కరించియున్నాఁడు. ఆగ్రంథము ముఖపత్రమున నిట్లున్నను తరువాతివారు దీనిని సూరిరచనములయందుఁ జేర్చుట శోచనీయము. (చూడుఁడు: ధాతుమాలపీఠిక.) ఈగ్రంథమునకు చిన్నయసూరి సంస్కారముండుటచేతను నీతిచంద్రికకన్న ప్రథమవచనగ్రంథమగుటచేతను నిది తిరిగి ముద్రితము కావలసియున్నది.

3. వింజమూరి కృష్ణమాచార్యులు: ఈతఁడు అలంకారశాస్త్రమున ప్రత్యేకపండితుఁడై భట్టుమూర్తి రచితమైన కావ్యాలంకారసంగ్రహమును టీకాతాత్పర్యములతో ప్రకటించెను. ఇతఁడు కొంతకాలము పచ్చయప్పకళాశాలలోను ప్రభుత్వమువారి బోధనాభ్యసనపాఠశాలయందును పండితుఁడై యుండెను.

4. కశాలపాటి రంగయ్య: ఈతఁడాకాలమున సుప్రసిద్ధాంధ్రపండితులలో నొకఁడు. సూరి కీతఁడు సమకాలికబృందములో చేరఁదగిన పండితుఁడు. ఈతఁడు క్రీ. శ. 1819-వ సంవత్సరమున జన్మించి 63-వ సంవత్సరములో కీర్తిశేషుఁ డయ్యెను. ఇతఁడు వైశ్యుఁడు. సంస్కృతాంధ్రములలో కవి. భూతపురీమాహాత్మ్యము, కవిజనమనోహరము అను రెండు కావ్యములను

రచించెను. ఈరచనలకంటె నాంధ్రసారస్వతమునకు నీతఁడు చేసినసేవ మహత్తరమైనది. మొట్టమొదట తాళపత్రములనుండి పాఠములు సంస్కరించి మహాభారతము, భాస్కరరామాయణము, రంగనాథరామాయణము మున్నగుగ్రంథములను ముద్రింపఁజేసిన దీతఁడే. మహాభారతము పదునెనిమిదిపర్వములు విళందుర సోమసుందరముపిళ్లై యను నొకవదాన్యుని సహాయముచేత ముద్రించెను. ఈతనిచరిత్రమును శ్రీవీరేశలింగము పంతులవారు ఆంధ్రకవులచరిత్రము తృతీయభాగమున తెలిపి యున్నారు. ఈతఁడు చిన్నయసూరి నెక్కడను పేర్కొని యుండలేదు.

౫. కొమ్మి రంగయ్యసూరి: ఈతఁడు సూరిగారికి సాక్షాత్ శిష్యుఁడు. సూరివలెనే చాత్తాదవైష్ణవకులమునకు చెందినవాఁడు. ఆతనివలెనే నీతిసంగ్రహ మను నొకచిన్నిగ్రంథమును రచించి ప్రకటించియున్నాఁడు. ఇదియును ముద్రితమై సూరినీతిసంగ్రహమువలె పాఠశాలలకు మిగుల నుపయుక్తమై యున్నది.

౬. తంజనగరము రంగమన్నారయ్య:— ఈతఁడు ప్రసిద్ధుఁడగు దేవరాయసుధితండ్రి. ఈతఁడు కొన్ని సంస్కృతాంధ్రగ్రంథములను రచించి ప్రాచీనగ్రంథములకు వ్యాఖ్యానములు వ్రాసెను. ఈతని వచనశైలియు మనోహరముగ నుండును.

ఇంకను "చిన్నయసూరిజీవిత" మను గ్రంథమున సూరి శిష్యవర్గమును సమకాలికులను పేర్కొనఁబడియున్నారు. వారిలో నీక్రిందివారు సూరిసమకాలికులను ఆతని కనేకవిధముల

సహాయ మొనర్చినవారును నై యున్నారు. వారిలో కలువలపల్లి రంగనాథశాస్త్రిగారును, గాజుల లక్ష్మీనరసింహముశ్రేష్ఠి వీరిరు వురనుగూర్చి గడచినప్రకరణములలో చెప్పియుంటిని. ఇంక మిగిలినవారిద్దరు పాశ్చాత్యులు. ఒకరు ఆర్బత్ నాటుదొర గారు; రెండవవారు బ్రౌనుదొరవారు. వీరిలో మొదటివా రాకాలమున విద్యాశాఖావిచారణాధికారి (Director of Public Instruction) గా నుండిరి. సూరి తన నీతిచంద్రిక నీదొరవారి కంకిత మొనర్చియున్నాఁడు. ఈదొరగారు సూరిని సువర్ణహస్తకంకణ మొసఁగి యెట్లు సత్కరించినదియు నింతకు ముందే వివరించియున్నాను. ఇంక బ్రౌనుదొరవా రాకాలమున ఆంధ్రభాషావాఙ్మయమంతటిని పరిశోధించిన మహావిద్వాంసులు. వారు భారతదేశమున నుండి నప్పటికి చిన్నయసూరి పదునా ల్గేండ్లవాఁడు. చిన్నయసూరి పరమపదించుటకు యేడేండ్లకు పూర్వమే యాతఁ డీదేశమును విడిచి వెళ్లినాఁడు. కావున వారిర్వురికిని సమకాలికులైనను సంబంధ మేమాత్రమును లేదు. పరిస్థితు లిట్లుండఁగా బ్రౌను సూరివద్ద తెనుఁగును నేర్చుకొనె నని, "ఆంధ్రరచయితలు"అను గ్రంథమున వ్రాయఁబడియున్నది. ఇది యెంతయు నసమంజస మనుటకు నించుకంతయు సందే హాము లేదు. ఏలన బ్రౌనుదొరవారు తమసమకాలికుల వృత్తాం తము నెంతయును వారియుత్తరములలో పదిసంపుటములలో సేకరించియున్నారు. అందులో చిన్నయసూరివృత్తాంత మేమి యును గానరాదు.

మిగిలినవారినిఁగూర్చి ప్రత్యేకముగా ప్రశంసింపవలసిన యావశ్యకత లేదు.

## చిన్నయసూరి కుటుంబము-అతని వ్యక్తిత్వము

చిన్నయ తన యుద్యోగధర్మమును నిర్వహించుచు సుఖజీవనమును గడపుచుండెడివాఁడు. ఈతని కిరువురు కొమరులు. వారిలో ద్వితీయునికి శ్రీరేకము రామానుజసూరిగారి పుత్రిక నిచ్చి వివాహమొనర్చిరి. ఈరామానుజసూరిగారే చిన్నయ సూరి వెనుక నాతనిస్థానము నధిష్ఠించిరి. ఈయన కిరువురు కొమారులు. వారిలో ప్రథములు శ్రీరేకము మణవాళయ్యగారు, రెండవవారు భాష్యకారులుగారు. మణవాళయ్యగారు సబ్ జడ్జీపనిని నిర్వహించుచు హైదరాబాదులో మూసీనదీ ప్రవాహమున మరణించిరి. వారివద్ద సూరివృత్తాంతము కొంత యుండెను. కాని వారిమరణముతో నదియు నంతరించెను. మరియు రెండవవారగు భాష్యకారయ్యగారు తమ డెబ్బది యొనిమిదవయేఁట తమకు చిన్నయసూరినిఁగురించి తెలిసినవృత్తాంతమును కాగితముమూలముగా వ్రాసియిచ్చిరి. దానినుండియే పరిషత్తువారి సంపుటములయందు నీచరిత్రము ప్రకటింపఁబడినది.

చిన్నయసూరిగారు హాయగ్రీవలక్ష్మీ ఉపాసకులు. వారనవరత మీమంత్రములను పఠించెడివారు. ఇప్పటిపండితులవలెగాక వారు మిక్కిలి నియమముతో తమతమధర్మములను విధ్యుక్తముగా నాచరించువారు. వీరు వైష్ణవధర్మానుసరణముగ భక్తిశ్రద్ధలతో భగవన్నామమును జపించెడివారు. వీరియొక్క వేషభాషలనుగూర్చి ప్రసిద్ధపండితులు ప్రభాకరశాస్త్రిగా రిట్లు వ్రాసియున్నారు: 'చిన్నయసూరి స్ఫురద్రూపియై సన్ననిలాల్చిని ధరించి శుభ్రవస్త్రములతో కనుపట్టువాఁడు; కండ్లకు సులోచనములను ధరించెడివాఁడు. ప్రతిదినము స్నానమునకు వెనుక నేదైన

నొక భాషాప్రయోగమును క్రొత్తదానిని చూడకయే భోజనమునకు లేచెడివాఁడు కాడని ప్రతీతి. ఇట్టినియమముతో భాషాపరిశ్రమచేయుటఁబట్టియే చిన్నయసూరిరచనములు శాశ్వతములై యొప్పారుచున్నవి."

చిన్నయసూరి విష్ణుభక్తిపరుఁడై తనగ్రంథములన్నిటిని శ్రీవెంకటేశ్వరస్వామికి కృతినొసంగెను. ముందుదహరించిన "శ్రీస్తనాంచితకస్తూరి" యనుశ్లోకము నాతని నిత్యానుసంధానపరాయణత్వము నుద్ఘోషించుచున్నది. పచ్చయప్పయశోమండనమున గూడ శ్రీవెంకటేశ్వరస్వామినే యాతఁడు ప్రశంసించియున్నాఁడు. ఈవిధముగా గ్రంథప్రారంభమున దైవస్తుతి యొనరించు ప్రాచీనసంప్రదాయము ననుష్ఠించి నిర్మలుఁడైన భగవద్భక్తుఁడగు పండితాగ్రేసరి యగుటంబట్టి పండితలోకమున పూజనీయుఁడై వెలుగొందెనాఁడు.

పంతొమ్మిదవశతాబ్దప్రారంభమున ఆంగ్లేయుల పరిపాలనతో నూతనాధ్యాయ మొకటి ఆంధ్రసారస్వతమున నేర్పడినది. పాశ్చాత్యులు పరభాషను తెలుఁగును నేర్చుకొనుటకు సులభమగుపద్ధతు లవలంబించుటచే వ్యావహారికభాషకేగాని గ్రాంథికభాషకు నాస్కారము లేకపోయినది. ప్రాచీనగ్రంథములు సంస్కరింపఁబడినను నవి వ్యావహారికరీతిగా నుండుటచే ప్రాచీనసాహిత్యమునకు భాషాలక్షణములకు పండితులే కొంచెము సుదూరముగనిలువవలసినదశ యేర్పడినవి.ఇట్లు వ్యావహారికపంకనిమగ్నమైన యున్నతపరిస్థితులలో చిన్నయసూరి యుదయించి సలక్షణమును శాస్త్రసమ్మతమును శాశ్వతమును నగువైయాకరణ

సంప్రదాయమును సుప్రతిష్ఠమును గావించి తన్మూలమున గ్రాంథికవాఙ్మయప్రపంచమును పునరుద్ధరించినవాఁ డయ్యెను. ఇంతేకాక నవయుగవికాసమునకు తోడ్పడిన యుద్యమముల యం దీతఁ డెట్లు పాల్గొన్నదియు నీతనిరచనలే యుద్ఘోషించుచున్నవి.

ఆంధ్రవాఙ్మయప్రపంచమున నజరామరమును నాచంద్రార్కమును నగుయశస్సు సంపాదించి ప్రాచీనులగు నన్నయాదికవులతో తులతూఁగఁదగినవాఁ డీతఁ డొక్కఁడే. చిన్నయసూరి ప్రభవసంవత్సరమున ప్రభవించినాఁడు. దుందుభిసంవత్సరమున కీర్తిశేషుఁ డైనాఁడు. వాఙ్మయప్రపంచమున నాతనియశోదుంధుభి నేఁటికిని రేపటికిని మాఱుమ్రోఁగుచునే యుండును.

# పచ్చయప్ప యశోమండనము

## ఆంధ్రము

## క్రోధి 1846.

మ. గగనం బట్టు రసప్రపూర్ణవిలసత్కాందంబుల న్మీటి య
భ్రగసాలంబుగలిక్ సితచ్ఛదముల న్భాసిల్లి మేరుక్రియన్
జగదామోదసువర్ణభాస్వరముగా జానొందు పచ్చాప నీ
శగుణంబు ల్గణుతించు కోశ మిది యిచ్చ న్మెచ్చు గావించెడిన్.

ఉ. శ్రీవరవర్ణినీమణికిఁ బ్రేమపదంబు బుధోత్కరంబు లెం
తే వినుతింపఁ బెంపగు సహీనమహీభృదుదారవాళిసం
భావితపాదపద్ముఁడు కృపాపరిపూర్ణుఁడు శ్రీనివాసుఁ డా
ర్యావనుఁ డెప్డు పచ్చపధరాధిప కీర్తులఁ బ్రోచుఁ గావుతన్.

చ. అతులయశోవిశాలుఁడు జితాంతరఘోరవిరోధిజాలుఁ డం
చితసుగుణాలవాలుఁడు విశిష్టవిహాయుత చాతురీ నిరా
కృతదివిజాతసాలుఁడు గిరీశ పదాంబుజభక్తిలోలుఁ డా
శ్రితపరిపాలుఁ డార్యనుతశీలుఁడు పచ్చనృపాలుఁ డెన్నఁగన్.

చ. అనయము భిక్షితాశనమ యాట విషాదభావముం
గొని వసనంబు లేవడికి గుంది సగం బలుయు నట్టి పార్వతీ
శునిముకు వ్రోవ నన్న మిడి శుద్ధదుకూల సమర్పణంబులం
దనియఁగఁ జేసెఁ బచ్చ నరనాథుఁడు గేవల దాతృమాత్రుఁడే.

చ. అనవరతంబు డాసిన బుధాళి కభీష్టఫలంబు లిచ్చి భూ
జనులకు మేటి నానెఁగడె సన్నుతమంజులతావిలాసముల్
దనరఁగ నాశ్రితాళుల నుదారరసాంబుధిఁ దేల్చు పచ్చపా
వనివిభుదానవైదుషికి వారక మ్రాన్పడు సౌరసాలముల్.

చ. నిరుపమతావకీనకమనీయయశశ్శరదాగమంబునం
బరపగు కల్మషంబు భువనంబు దొఱంగుట యుక్తమేకదా
యరయ ఘనాళిజీవనసమగ్రతఁ గాంచి వహించు టొక్కటే
ధరణి విచిత్రమౌ రసముదారగుణాకర పచ్చభూవరా.

చ. తెలిసె శరత్సమృద్ధి ధరణీ నెందు మరాళపాళికిం
బలుపుగ మీఱె గల్వలకుఁ బాండురపక్షము సర్వకాలముం
దెలుప యొకింతలేక భవదీయయశంబు భృశంబు పేర్మిమై
వఱలఁగఁ బచ్చభూరమణ భవ్యలసద్గుణరత్నభూషణా.

సీ. తనమనోభీష్టప్రధానశౌండతకు కల్పద్రుమం బాకులపాటు నొంద
దనలసద్గంభీరతాగుణస్ఫూర్తికి వాహినీపతి భంగపాటుఁ దొడరఁ
దన నిరంతర ధీరతానుహిమకుఁ గట్టురాయఁడు పాదసంక్రాంతిఁ బెరయఁ
దనసకలాభినంద్యక్షమాలక్ష్మికిఁ బృథ్వీమహాదేవి క్రిందుపడఁగ
వఱలు నీధన్యుఁ గుణమాన్యుఁ బరమపుణ్యు
సాధుజనగణ్యుఁ బోలంగ జగతి గలరె
యనుచు నభినుతు లెల్లచో నల్లికొనఁగ
నుల్లసిల్లుఁ బచ్చపావనీవల్లభుండు.

సీ. ఆశావధూటి కాకేశపాశములకు మల్లీమతల్లి సంపత్తి నెఱపి
యామినీ కామినీస్వామిపక్షమునకు స్వచ్ఛాంగరాగవిభ్రమ మమర్చి
వారాశిగూరుకు వారిజేక్షణునకు హీరవర్మశ్రీ రచింపఁజేసి
యామరసామజాతాస్యబింబమునకు ముత్యాలమొగముట్టు మొఱవుఁ జూపి

డంబు దళుకొత్త నైవేద్యశంబు విష్వ,సంబునకు రవణంబు సందంబు మీఱు
సమ్మహాశీలు సుగుణలతాలవాలుఁ, బచ్చపనృపాలు నిలఁ బోలువారు గలరె.

సీ. చందనహిమవారిసమభిషేకంబున దలచుటి పెనునాడుఁ దలఁగఁజేసి
కమనీయకస్తూరికాసంకుమదచర్చఁ బూదిపూఁతల బొచ్చుఁ బోవ వెట్టి
హారుమంజిముత్యాలచెరఁగు హొంబట్టుచే దోలుచేలపుటేవఁ దొలఁగఁద్రోచి
యమృతోపమానదివ్యాన్నార్పణంబునఁ గంఠగరళకటుకత్వ ముడిపి

గీ. హరుమహాదేవు నిత్యసమర్పణక్రి, యాకలాపంబులనుఁ దనియంగఁజేయు
మహితబుధలోకజేగీయమానుఁడయిన,పచ్చనృపమౌళి యాశ్రితపద్మహేళి.

చ. అమృతకరుండు తారకము లాదిమనాగము దేవతాగవా
రము తగ నెంతకాలము గరంబు తిరంబుగ నుండు నాతెఱం
గమరఁగ సంతప్రొద్ధ నిరపాయతఁ బచ్చనృపాలకీర్తుల
న్నొమరుగ శ్రీనివాసుఁడు గనుంగొని సత్కృపఁ బ్రోచుఁ గావుతన్.

---

## వి శ్వా వ సు 1846

ఉ. శ్రీయలమేలుమంగ కుచసీమఁ బయంటఁ దొలంగఁ గాంచి కాం
తా యిట గొండపై నిరతవర్షముసం దగి గోరువంక లిం
పై యలరారెఁ గంటె యన సారసి నిబ్బితిపూను నచ్చెలిం
బాయక కౌఁగలించు హరి పచ్చపకీర్తుల నిచ్చఁ బ్రోవుతన్.

చ. సతత మనంతభోగముల సున్నతికెక్కినవాఁడు కల్మిగు
బ్బెత కిరవైనవాఁడు ఘనవిభ్రమ మూనినమేనివాఁడు రా
జితగుణరత్నహారములచేఁ దులకించెడువాఁడు సూరివం
దితుఁ డగు శ్రీనివాసుఁ డిల నిచ్చలుఁ బచ్చపకీర్తిఁ బ్రోవుతన్.

## పరాభవ 1847

ఉ. శ్రీ కనుగల్వపోయి వికసిల్ల దరస్మితచంద్రికావళిన్
లోకతమంబు లెల్లెడల లోఁగఁగఁ జేసి బుధోత్కరంబున
స్తోకరసంబు గొల్పెడు విధుండు మహామహుఁ డిచ్చ నిచ్చలుం
జేకొని యుబ్బఁజేయు నృపశేఖరపచ్చపకీర్తివార్ధులన్.
ఉ. చల్లఁదనంబు లెల్లెడలఁ జల్లెడు మిన్కులవాఁడుగాని తా
నొల్లఁ డొకప్డు సుగ్రకతిరోజభావళిఁ దన్పుచోట రం
జిల్లఁగఁ జేర్పఁగాని కొఱఁ జెందఁ డొకప్పుడు బచ్చపక్షమా
వల్లభుఁ డీగుణాకరుని సాటియొరా జొకఁ డివ్వసుంధరన్.
క. భువనభరణనిపుణుం డయి
తవిలి తనుం గొలుచు విప్రతతికోరుకు తె
క్కువ గాఁగ గురియుపచ్చప
ధవుఁడు ఘనుఁడు గాఁడె యెవ్విధంబునఁదలఁపన్.



## చిన్నయసూరిగారి సంస్కృతశ్లోకములు

## క్రోధి 1845

శ్లో. ఏకాంకలాం భువనజాతహితాం దధాన
స్సర్వజ్ఞతాం వదకథం లభతే గిరీశః
బహ్వీః కలాభువనజాతహితాదధాన
సర్వజ్ఞ ఏవ ఖలు పచ్చపమానవేన్ద్రః.
శ్లో. శ్రీపచ్చయప్ప నరనాథ భవత్కరోద్య
ద్దానామ్బువార్ధిజ యశోమయపూర్ణచన్ద్రమ్

దృష్ట్వాకలఙ్కమతిలజ్జితయా హిమాంశుః
కార్శ్యం ప్రయాతి బహుళం న దివా చ కాన్తి.

శ్లో. గుణస్య బాధికాం వృద్ధిం కృతవాన్పాణినిః పురా
అబాధితగుణాం వృద్ధి మకరోత్పచ్ఛపప్రభుః.

శ్లో. పశ్యాయామహోనయంద్యుసరితఃపూరాదిశశ్ఛాదయం
స్తత్రాస్నద్గజవాజిధేను తరవోమగ్నాః పునశ్చైక్షితాః
ఏవం చారజనం బ్రువాణ మమర స్వామీహాన్వక్తిభో
మాభైషీర్నని భఙ్గవానయమతః పచ్ఛప్పకీర్తేర్మహాః.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1953.

# వ్యాకరణములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, పద్యకావ్యము | ... | 0 | 6 |
| కవిజనసంజీవని | ... | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము | ... | 0 | 12 |
| సులక్షణసారము | ... | 1 | 8 |
| లఘువ్యాకరణము | ... | 1 | 0 |
| ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము | ... | 1 | 0 |
| పట్టాభిరామపండితీయం, (పద్యవ్యాకరణము) | ... | 0 | 8 |
| శ్రీరావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి తెనుగువ్యాకరణము(ప్రాచీనము) | | 1 | 8 |
| ప్రౌఢవ్యాకరణము | ... | 1 | 8 |
| ,, | ... | 3 | 0 |
| వ్యాకరణసంగ్రహము | ... | 0 | 8 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | ... | 0 | 12 |
| ఆంధ్రశబ్దమంజరి బ॥ సీతారామాచార్యులు | ... | 0 | 12 |
| బాలచంద్రోదయము, అలఘుకౌముది ,, | ... | 0 | 8 |
| బాలవ్యాకరణము, శ్రీచిన్నయసూరిగారిది | ... | 1 | 4 |
| ,, శ్రీదూశిరామమూర్తిగారి టీకతో | ... | 6 | 0 |
| ,, విద్వాన్ బులుసు వేంకటరమణయ్యగారి లఘుటీకతో | | 2 | 8 |
| బాలసరస్వతీయము, సటీక | ... | 2 | 0 |
| విభక్తిచంద్రిక | ... | 0 | 6 |
| వావిళ్లనిఘంటువు 1-వ సంపుటము (అ మొదలు ఔ వఱకు) | | 10 | 0 |
| ,, 2-వ సంపుటము (క మొదలు ఞ వఱకు) | | 12 | 0 |
| ,, 3-వ సంపుటము | | అచ్చు | |

**వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,**

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| తులసీదాసురామాయణము, వచనము | ... | 12 | 8 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుగువచనము | ... | 5 | 0 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 12 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 12 |
| పంచతంత్రహితోపదేశకథామంజరి | ... | 1 | 12 |
| నీతిరత్నాకరము | ... | 1 | 8 |
| సామహారాష్ట్రయాత్ర | ... | 4 | 0 |
| నేటికాలపుకవిత్వము, శ్రీఉమాకాన్తముగారిది | ... | 3 | 0 |
| సంగ్రహరామాయణము | ... | 1 | 8 |
| సంగ్రహభాగవతము | ... | 2 | 8 |
| భోజునికథలు | ... | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I భాగము | ... | 1 | 4 |
| ,, II భాగము | ... | 1 | 4 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 8 |
| ,, A. S. P. అయ్యరుగారిది | ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు,సీతారామశాస్త్రి 1,2భాగములు | ... | 2 | 0 |
| ,, వేంకటరమణయ్య 3.వ భాగము | ... | 1 | 0 |
| రాజశేఖరుఁడు, గోపాలుఁడు | ... | 0 | 12 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 12 |
| చార్ దర్వేషుకథలు | ... | 1 | 0 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 12 |
| బేతాళునికథలు | ... | 0 | 12 |
| వైద్యులకథలు | ... | 0 | 6 |
| పీ[illegible]గసలు | ... | 1 | 0 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 6 |
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | 8 |
| రేచుక్కపగటిచుక్కలకథలు | ... | 0 | 4 |

## నిఘంటువులు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| వావిళ్లనిఘంటువు (అ-ఔ వఱకు) 1-వ సంపుటము | ... | 10 | 0 |
| డిటో (క-ఞ వఱకు) 2-వ సంపుటము | ... | 12 | 0 |
| డిటో (ట-ఱ వఱకు) 3-వ సంపుటము | | అచ్చు | |
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యకావ్యము | ... | 0 | 6 |
| బాలచంద్రోదయము, అలఘుకౌముది | ... | 1 | 0 |
| పద్యాపహామంజరి, (అరుభావల ఒకేబ్యులరి) | ... | 2 | 8 |
| తెలుగుసామెతలు with English Translation by Captain Carr | ... | 2 | 0 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | | 10 | 0 |
| Sankaranarayana's English-Telugu Dictionary, శంకరనారాయణగారినిఘంటువు (ఇంగ్లీషుపదములకు తెనుఁగు అర్థములు) | ... | 15 | 0 |
| ,, (తెనుఁగుపదములకు ఇంగ్లీషు అర్థములు) | | 12 | 0 |
| English-Telugu Pocket Dictionary ఇంగ్లీషు-తెనుఁగు పాకెట్టు డిక్షనరి | ... | 5 | 0 |
| Translation Guide [English to Telugu & vice versa] | | 2 | 8 |
| సంస్కృతాంధ్రనిఘంటువు | ... | 5 | 0 |
| త్రికాండశేషము, సటీక | ... | 1 | 12 |
| విశ్వకోశము, (విశ్వనిఘంటువు) సటీక | ... | 2 | 8 |
| మేదినీకోశము ,, | ... | 4 | 0 |
| హారావళి, ఏకాక్షరీకోశము ,, | ... | 1 | 0 |
| అమరము, ప్రథమకాండము మూలము పెద్దచ్చు | ... | 0 | 4 |
| ,, ,, టీక | ... | 0 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | ... | 0 | 3 |
| ,, టీకతో | ... | 0 | 10 |
| అమరము 3 కాండలు, మూలము | ... | 1 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టుబాక్సు 1372, మద్రాసు. 1.